# వైరాగ్యపుష్పగుచ్ఛము

(అనురామచంద్రశతకము)



రచయిత:

'అనుభవవేదాంతప్రదర్శక'

చదువుల వీర్రాజు.

ఓమ్.

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః

# వైరాగ్యపుష్పగుచ్ఛము

(అను రామచంద్రశతకము)

శ్రీ సుభక్తుల కత్యంతానందము కలుగునట్లు

ఉపనిషత్సారాంశము క్రమముగ

అః కాపల్లి వాస్తవ్యులగు

"అనుభవవేదాంతప్రదర్శక"

## చదువుల వీర్రాజు శర్మ విరచితము.

"కవిభూషణ-శతావధాని"

గోరుగంతుఅచ్యుతసూర్యనారాయణశర్మగారిచే శోధితము.



వెల 0—6—0

క. శ్రీరఘురామునిపేరిట
వైరాగ్యమున జ్ఞానములభక్తియు నెలయన్
గూరిచితి వీరరాజ! సు
ధీరా! నీయంతశతకు దెలియు శతకమున్ ॥

క. శతకము వ్రాసిన ...
బతుకమువలె మెరయుచుండ వ్రాసినవాడే
కృతకృత్యుడు శ్రీసీతా
పతిభృత్యుండు సద్యశోభనవిఖ్యాతగుణ్ ॥

కవిభూషణ శతావధాని { గో॥ అమ్మృతపు వ్యాసానారాయణశాస్త్రి.

ప్రతులు 1000

పబ్లిషర్:—
బులుసు వెంకటశాస్త్రి,
ప్రొప్రైటర్:— శ్రీశారదాబుక్ పబ్లిషింగ్ అండ్ బైండింగ్
వర్క్సు ము జ. నెం 93 డి. 5—4—1946

శ్రీ శారదాముద్రణాలయము, భట్నవిల్లి, అమలాపురంతా॥ తూ॥ గో॥ జి॥
ము జ, నెం 81.

# వైరాగ్యపుష్పగుచ్ఛము.

సీ. శ్రీరామచంద్ర! నే వైరాగ్యబోధోప
రతి, పుష్పగుచ్ఛసంతతులఁ గూర్చి
అర్పించెదను హార మధ్యాత్మపరమైన
భక్తిభావనయుక్తి యుక్తముగను
కలవెన్నొ మాలికల్ గంధము సంపగా
ననుచు గ్రంథను గనఁగఁ బోకు
తప్పొప్పు లనుట శాస్త్రజ్ఞులకే గాని
జనుల కెన్నియు సమంజసము గాదు!
గీ॥ హృదయమను, నాలవాలమం దిగురు లొత్తు
భక్తిలతలకు భూజంబు పాత్రి నర
పూర్తి సేయుము రవికులపూర్ణచంద్ర!
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర! . 1

సీ. శ్రీశ్రేయసంబైన స్వర్గాదిభువనముల్
లీల నెలకొను నాట్యశాల గాఁగ
కనులకు సంతోషజనకంబులౌ సూర్య
చంద్రులు దీపికాచయము గాఁగ
శబ్దాదిగుణవిశిష్టంబైన యల పంచ
భూతము ల్పాత్రలై ఖ్యాతిఁ దోఁప
మోహవిభ్రాంతులై మొదలు గన్గాన లేక
జీవకోటులు సభ్యులై నెలుంగ.
గీ. రాత్రిఁ బవలను తెరలచే రమ్యముగను
విస్మితంబుగఁ గప్పుచు విప్పుచుండి
నాటకమ్ముల నాడెడు బూటకమ్ము
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 2

సీ. శకటంబు దేహంబు చక్షురాద్యము లెన్న
సర్వాహక్కుల యధిష్ఠాత వీవె
బండిఁ దోలుటకు నేర్పరచిన జీవుండ
బండివాడని సంజ్ఞ ప్రకట మయ్యె
వృషభంబులన దల్చు వృత్తియన్ కొరడాకు
బుద్ధితాళ్ళటినిఁ గట్టి సిద్ధపరచి
విషయమదోన్మత్త వృషభంబులను పూన్చి
కైవల్యపురిని సౌఖ్యముగఁ దింపు
గీ. మంటినయ్యయ్యొ యెన్నొ నన్నంధుఁ జేసి
మోహగర్తంబులోఁ గూల్చి మూర్ఛరించె
అండఁ జేర్పుము నీవె యీ బండిఁదోలి
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 3.

సీ. ఎందుకు జగతిలో ని ట్లుద్భవం బన్న
మరణమే కారణం బని వచింతు
మరణనిదాన మే మని ప్రశ్న వేయంగ
పుట్టుకయే దీని పూర్వమంత్రు
అన్యోన్య మాశ్రయంబై యిట్లు తగులుచు
భావ మయ్యె నవినాభావ మగుచు
తగవు తీరద యంతు దరి లేని జలధియై
కర్మవాసనలు పై గ్రమ్మె నిట్లు.
గీ. చిత్రమైనట్టి తగవులోఁ జిక్కినాడ
తగవులను దీర్చుటకు నీవె తగినవాఁడ
వనుచు వేడితి రక్షించు మవనిజేశ
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 4.

సీ. పదునాల్గు జగము లాభాసగా సృజియించి
వ్యాపకకళరూపుఁ జూపు నెవఁడొ
స్వప్నవిలాసము లసత్యంబుగాఁ దోఁచఁ
బ్రకృతి నధిష్ఠించు సుకృతు డెవఁడొ
యెల్ల జీవుల నిండి యెచ్చటఁ గనుఁగొన్న
జలచరాదుల కందఁ జాలఁ డెవఁడొ
హృత్పద్మములలోన నిమిడి శోధనచేసి
సజ్జనాళినిఁ బ్రోవ సక్తుఁ డెవఁడొ.
గీ. ఋషులు రమియింపఁ బ్రణవంబు ప్రిదులుకొనఁగ
గల్గెఁ గ్రీడార్థధాతువు క్రమముగాను
అదియె శ్రీరామ బ్రహ్మంబు నదియె నీవు
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 5.

సీ. నే నజ్ఞుఁడ నటంచు ధ్యానించెదను మ్రొక్కి
ద్వైతభావముచేత తాతవలెను
సారూప్యమున సదా నారాయణా యంచుఁ
బ్రజ్ఞచేఁ గొల్తు మత్ప్రపిత యట్లు
సదసద్వివేకినై సాయుజ్యమును గాంచు
శివశక్తులట్లు నిశ్చింత నుందు
ఆద్యంతములు లేని యాదిద్వంద్వము పాదు
పుత్రపౌత్రులు లతాప్రతతులును
గీ. వెలయుచున్నవి శాఖలు వృక్షమొకటె
క్రింద మీఁదని కొట్లాడి గుంద నేల
మతము లన్నియు నీకు సమ్మతముగాదె
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 6.

సీ. మోక్షసౌధము నెక్క మొదటి సోపానంబు
సజ్జనసహవాససంశ్రయంబు
సహజసంతోషంబు సరిశమా రెండవ
యధిరోహణంబు బంధు రార్యజనులు
తివిరి యాత్మానాత్మధీచర్చ సల్పుట
పరగ ద్వితీయసోపాన మరయ
శమము తురీయమూ విమలాధిరోహిణి
యై యొప్పు మెట్లు సమాప్తి యగును.

గీ. అదియె మోక్షంబు గ్రనల్కు మనఁగ నదియె
నీదు భక్తుల కన్నియు నిహితముగను
గల్గు నవలీలగాఁగ త్వత్కరుణ జేసి
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 7.

సీ. తలనొప్పి చెవిపోటు తనువుగో వడబాటు
బడివేటు నుష్ణ మూర్ఛని తీట
దంతము ల్సలుపంగ బంతగించిన యట్లు
పనులు సేయక పండ్ల యునికిపాటు
గాఢంబుగా వృశ్చికాదిదష్టముఁ గల్గ
కెరవి దొర్లుచుఁ బాట తిరుఁగులాట
కాలు బెణుకులు చురుక్కని కరల్ కరలంచు
పాదము గ్రదలింపఁ బ్రాణసోక.

గీ. చక్షువుల బాధ వ్రణములు సలుపు వేధ
యెన్నియో కోట్లు వ్యాధుల నిహములోన
పాతకుల శిక్షకై యిట్లు ధాత సేసె
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!.

సీ. దర్పణంబున బింబమర్పించు పగిదిని
కలలోన మాయాజగంబుఁ జూపి
తెలివి గల్గిన తోడ ధీరుఁడై కల్లగాఁ
దలఁచి తానొక్కఁడై వెలయునట్లు
అజ్ఞానమున మోహ మావరింపఁగఁ జేసి
భువనము ప్రత్యక్షముగను జూపి
స్వస్వరూపజ్ఞాన భానూదయంబైన
బ్రహ్మాస్మి యను బ్రహ్మభావ మొంది.

గీ. యేల యిట్లాడుచుండుట బాలలీల
ఆట లన్నియు మాకు ప్రాణాంతమయ్యె
నేద దీర్చుచు మమ్ము రక్షించవయ్య
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 9.

సీ. దృశ్యరహితముగా దృష్టినిల్పిన యోగి
బ్రహ్మతారాంతరంబై వెలుంగు
యత్నంబు లేక ప్రాణాయామసంసిద్ధి
తరియింప శిఖరూపతను వెలుంగు
యెపని చిత్తము వేరె యవలంబరహితమై
తారకజ్యోతిసంధాన మగును
హఠయోగ మిసుమంత యభ్యాస మెఱుఁగక
పరమందు బ్రహ్మభావమున నుండు.

గీ. అట్టి సిద్ధులునొక్క పర్యాయమున నె
గల్గు నిను ధ్యాన మొనరింపఁ గలుషహరణ
నీదు నామంబునకు సరి లేదు భళిర!
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 10.

సీ. అగ్ని నిరింధనం బైన జ్వాల కృశించి
స్వస్థానమున లయం బందినట్లు
నీరమ్ము లేక జంబీరభూరుహ మెండి
నెడరూపమున బొట్ట విడచినట్లు
తైల మింకినవరి దగ్ధమై మొదలంట
దిగ గాలి ప్రిమిదయే మిగిలినట్లు
జీవుముద్ధతగతి బోవంగఁ గాయంబు
స్పందన హీనమై గుందినట్లు.

గీ. వృత్తి యాంతరమైన దుర్వృత్తు లడఁగి
ప్రాజ్ఞుతోఁ గూడి చిరప్రబ్రహ్మ మందుఁ
గలసి ఫలలబ్ధి లేకుండ గాదె యవల
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 11.

సీ. అస్తిభాత్యాదుల వ్యష్టి సేయుచు నాత్మ
విశ్వనామంబున వెలసినాడ
స్వచ్ఛందముగ సూక్ష్మ జగములు గల్పించి
స్వప్రకాశుఁడనైతి స్వప్నమునను
ఆనందమయకోశమందు రారాజునై
అజ్ఞానముననుంటి ప్రాజ్ఞుఁ డగుచు
నీయంతవాఁడవు నీవైతె నాకేమి
యెవరంతవారలై తిరుగఁగలము.

గీ. ఇను మనస్సాంతసన్నిధి నెదిరినట్లు
లక్షణము వీడి తత్త్వకలక్ష్యమునను
జేరి నాడను నీవేమి సేయగలవు
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 12.

సీ. మోహాబ్ధినుండి నిర్ముక్తుండనై యాత్మ
జ్ఞానినై వర్తించు గాంక్ష కలదు
శాస్త్రము ల్పఠియించి సద్యశోవ్యాప్తిచే
గణన కెక్కఁగ నాకుఁ గాంక్ష కలదు
గుహ్యేంద్రియాదిదుర్గుణముల నరికట్టి
కవుల మెప్పుగ్రహించు కాంక్ష కలదు
'దాత గుణవ్రాత ధన్యుండహో!' యని
ఖ్యాతి వడయుటకై కాంక్షఁ గలదు.

గీ. గాని మనసను సరసిని గాము మనెడు
మొసలి వసియించి సద్వృత్తి మెసవుచుండె
నిన్ను స్మరియింపఁ దద్గ్రహనిధన మగును
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 13.

సీ. ధనశబ్దమును విన్న మనము తల్లడమంది
గిరగిరమని చుట్టి తిరిగి పోవు
కాంతలఁ గనుఁగొన్న కలవాక్కులనువిన్న
యొడలెరుంగక తెల్వి సడలుకొనును
రుచియగు భక్ష్యముల్ రూపి జిహ్వకు నంట
నెరమ్రింగు సర్పంబు కరణిఁ గాల్చు
తృష్ణచే చక్రిసందీప్తి నశింపఁగ
మొగము నెల్వాల బారి ముకుళ మగును.

గీ. మిగుల మండిన కారవు మిరపకాయ
కొట్టులో నుండఁగా దగ్గకుండు టెట్లు?
వస్తుసంసర్గమున దోషవంతుఁడగును
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర. 14.

సీ. జీవరూపప్రాణి శిశువు నేత్రమునందు
నాశ్రయింతురు రుద్రుఁడాదిగాను
జీరలు రుద్రుఁడు నీరము పర్జన్యుఁ
డాదిత్యుఁడగును గ్రుడ్డనలుపు
శ్వేతవర్ణము వజ్రి పృథివి యధోభాగ
మంతరిక్షము చక్షు వగును పైని
అక్షిపూరుషుఁ డీత డధ్యాత్ముఁ డనియును
రధిదైవతము సూర్యుఁ డతడె యితడు.

గీ. దారమొక్కటె మణులు వేర్వేర నుండు
నట్టు లాంతరయామి వ్యక్త పడక
త్రోయుచుండును పుత్రశ్రేయమునను
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 15.

సీ. భర్త యందభిలాష పరమార్థమునను గా
దతనిపై ప్రేమ స్వాత్మార్థ మగును
తండ్రిపై స్థిరమైన తనయు సౌహార్ద్రంబు
నతనికై కాదు స్వాత్మార్థ మగును
ధనము నిక్షేపించి దర్శించుచుండుట
ధనముకై కాదు స్వాత్మార్థ మగును
తనవారి క్షేమంబు తనకొరకే గాని
తెవులదు తనదు బంధువులపైని.

గీ. ఆత్మసుఖమునకై జగం బమరియుండె
భవ్యమైనది యాత్మ ద్రష్టవ్య మదియె
తనకు శ్రోతవ్య మదియె మంతవ్య మదియె
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 16.

సీ. బలమైన రోగాదిపటలములు సర్వదా
పీడించుచున్నవి విగ్రహమును
కామాదిశత్రువర్గములు చిత్తమునందు
వేధించుచున్నవి పెక్కుగతుల
ధనదారపుత్రికత్రయమైన సంకెళ్ళ
తుంటివానిగఁ జేసి కూలఁద్రోసె
ఇక్కట్లు తప్పించు టెట్లో యని తపించఁ
గాలుచు దినసము గ్లాససేయు.

గీ. మొఱ్ఱ విన విధియేమి యేమో యంటుచు
నెడము చేసిన విషతునాఁకడలిపాన్ప!?
అఱవఁగా లేను గొంతుక మొఱముపోయె
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 17

సీ. పంచేంద్రియంబులు బలుతైన హోతలు
యజ్ఞవాటిక దేహ మంత్రిబుధులు
హృద్వేదికయె యగ్ని వృద్ధిఁ జెందు తలంపు
కామాగ్ని కీలలు గ్రమ్ముకొనును
శబ్దాదివిషయకాజ్యముల ధారలు కల్గి
బలమైన మంటలు ప్రబలుకొనును
వాసనేంధనముల వ్రాతచేఁ బలుమారు
జీవయాజకతను జేయబడును.

గీ. అజ్ఞుఁడొనరించు నిమ్మహాయజ్ఞఫలము
నరకసామ్రాజ్యమేయగు నధికముగను
దుఃఖపాలనమగ్నుఁడై తూఁగుచుండు
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 18.

సీ. తండ్రి మృత్యువు నొందె తాత గతించెను
మాత గూలెను పితామహుఁడు గుండె
ప్రపితామహుండును బంచత్వము వహించె
వీధిలో మడిసిరి వృద్ధజనము
పరిపాలనము సేయఁ బ్రభువు నంతము నొందె
మందిరంబులుఁ గొన్ని మార్పు చెందె
దినదినంబున శక్తి దిగజారి ప్రాణోత్క్ర
మణమునకై వేచి మసలుచుంటి.

గీ. ఒక్కరొక్కరె శకటంబు నెక్కినట్లు
పెద్దలందరు దివికేగ వెనుక నేను
పయనమై సిద్ధముగనుంటిఁ బ్రతిదినంబు
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 19.

సీ. సరసి నాచ్ఛాదించు శైవాలజాలంబు
నిబిడమై యుణ్ణైనను నిలువఁబోదు
అటువలెనే మాయ యావరించి గ్రహించు
నపరాభిముఖుఁడగు బ్రాజ్ఞునైన
తద్ధేతువున ఋషుల్ సద్దేశికంబైన
వృత్తి వీడరు బ్రహ్మవేత్తలగుచు
విడచియుంచిన నాచు సహముఁజుట్టినయటు
లావరించును మాయ యనవరతము

గీ. కాన నన్నెన్నడైన నజ్ఞానమునను
మున్గనీయక నీపదాంభోజయుగము
నుండి వీడ్కొన సేయక నుంచు మెప్పుడు
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 20.

సీ. అశ్వత్థబీజంబు నగు మహాబిందువే
"రూప మేర్పడనట్టి రూప మయ్యె
స్వరము ప్రాణము బిందుసంయుక్త మగుచును
'రా'యను బీజాక్షరంబు నయ్యె
మరలఁ బ్రకృతి మారి మాయాస్వరూపమై
"మా"యను బీజసంభవము నయ్యె
రాజితంబౌ రామబీజద్వయంబు నై
శ్రీకారమున శక్తిశివులు నయ్యె
గీ. నీలలోహితశక్తి నమ్మేళనంబు
రామమంత్రంబు వాల్మీకిరక్షితంబు
నీదు నామంబు శ్రుతిప్రతిపాదితంబు
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 21.

సీ. పాదరసంబెప్డు పరుగిడుచుండును
మనసుగూడను దాని ననుసరించు
మరణమూర్ఛాదులు హరియించు రసమును
శోధించి యొసగిన శుభముఁగల్గు
మానసశుద్ధిచే మహిమలు సిద్ధించు
నాకాశగమనాణిమాదికంబు
భక్తి కల్గును జ్ఞానపథికుఁడై విహరించి
ముక్తి గాంచు విదేహముక్తుఁడగుచు.
గీ. సకలసిద్ధులు శ్రీరామసంస్మరణకతన
గల్గు నవలీల భక్తుల కౌషధంబు
శుద్ధిచేయుము చిత్తము సిద్ధచరిత
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 22.

సీ. ఇలఁ గల దేశముల్ తిలఘాతకుని శాల
భవము నాశనము సంభ్రమణచయము
కండ్లగతంలు వైచి గానుఁగునకుఁ బూన్చి
త్రోలెను దైవమే తైలకరుఁడు
తిలకర్షణము సేయు తెలుకలియొద్దను
జీవులు బతుంబు చిత్త మరయ
గానుఁగనోగ దేహాకారంబుపై నున్న
భారమైనట్టి సంసారభారంబ.

గీ. కండ్ల గంతలె యవివేకకారణంబు
తైలపిష్టంపు రుచులకుఁ దగులమించు
విడువ దీయెద్దు ఆటకు విడుపు లేదు
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర! 23.

సీ. అధ్యస్తమగు వస్తువాభాస మగుఁ గాని
సత్య మెట్లగును వస్త్వర్థమెట్లు
జననము లేక నాశన మెట్లు సిద్ధించు
స్వప్నపదార్థవాస్తనము వలెను
ఉన్నదానికి నఘం బుత్కృష్టములు గాని
యెండమావుల పర ముంచు టెట్లు
కావున వాసనాకార్యఫలంబులు
గల్గ వెప్పుడు నసత్కార్యమునకు.

గీ. మాటయే గాని ప్రారబ్ధ మనఁగ లేదు
అట్టి యెడ సంచితాగాము లెట్లు లోపు
కర్మ గోప్యము బహుళమై గహన మగును
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 24.

సీ. క్రోధగుణాగ్నిచే రుధిరరేఖలుఁ గ్రమ్మి
యెఱ్ఱబారుచు నుండు బెఱ్ఱుబిగిసి
గ్రుడ్లగూబ ముఖంబు రూపుఁ జూపుచు గ్రుడ్లు
ద్రిప్పుచు నలుదెసల్ గప్పికొనును
అన్నము హితవు గాదారేయి నిద్దుర
లేక ఘుర్ఘురఘోణశీల నొందు
ఇతరవార్తలు శ్రితంబేమాత్రమునుఁ గాక
వ్యాధిపీడితుఁడట్లు బాధ నొందు.
గీ. అట్టి క్రోధంబునకు కామ మనుఘ్రపడిన
కొండముచ్చుకు ముట్టైన కోతినైన
భాతి నుండును యెన్నన్న బట్టుఁబడును
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 25.

సీ. ఇంద్రియంబులు మనం బేకముఁ జేసిన
బదుకొండను సంఖ్య మదిని దోఁచు
అదియె యేకాదశియై యొప్పు నుపవాస
మనఁగ నాత్మసమీప మనుర సేత
వైరాగ్యతైలంబు వర్తి సద్భక్తితో
బోధపాత్రమునందుఁ బూర్తి చేసి
జ్ఞప్తిదీపముఁ బెట్టి తృప్తిగా బహ్మోప
లోకంబున ముక్తి రూఢియగును.
గీ. ఉప సమీపార్థమని శ్రుతి విపులముగను
జెప్పె యేకాదశీమర్మ ముప్పుమీలఁగ
గాని శుష్కోపవాసంబుగాదు ధరణి
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 26.

సీ. కాంకిమూంకలు నల్లకాట మూంగినరీతి
చిత్తాశ్రయంబైన వృత్తిచయము
తొండ యూసరవెల్లి తోయమై యున్నట్లు
వృత్తి పరిణతమై విషయ మగును
విషమును మించు దుర్విషయమస్యంబుచేఁ
జీవుఁ డున్మత్తుఁడై చిక్కనగును
అనురాగమను నూంత నానుమం గర్మచే
ఘటయంత్రభ్రమణంబు దిటవు నూను.

గీ. అఖిలఫలసంచయము నీశ్వరార్పణంబు
సేయఁ గ్రియలయందు 'నహ'మనుజగురు మ్రగ్గి
మొలకలెత్తక జీవన్ముక్తుఁడగును
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 27.

సీ బాల్యమందున తోఁటి బాలురతోఁ బాలు
విద్యలేదని కుంది వెతలు చెందు
విద్యఁ గల్గిన మంచి యుద్యోగి యవుటకు
కళవరపాటునఁ బలువరించు
పెండ్లికై యీడైన పిల్ల నన్వేషించి
సంతుకై మ్రొక్కు ననంతరంబు
సంతతి గలుఁగంగ సంతృప్తి విరహమై
గొంగ్రొమ్మకోర్కెలఁ గూలియుండు.

గీ. లతలు మ్రాఁకులఁ బ్రాకి వ్రేలాడునట్లు
నీరుతోడిన కొలది బెల్లూరినట్లు
కోర్కె లిగురొత్తు వివిధమై కోట్లకొలది
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 28.

సీ. తలుపు తల్పని పిల్చి తలుపుఁ దీయుమటంచు
తలుపుఁ గ్రుద్దెదరు సందడి నహించి
యెవరు వారని యింటిజవరాలు ప్రశ్నించ
నెవరు లేరని పల్కి హెచ్చరించు
ప్రత్యుక్తి కనురూపప్రత్యయ మడుగంగ
నేను నేనని పల్కి నిలువఁ బడును
కులగోత్రనామము ల్దెలియంగవచ్చియుంతుర
తలుపుఁ దీయకఁ గొంత తడవుసేయ.
గీ. అన్య మొక్కింత లేదు చిదాత్మ తక్క
యహము నామము రూపమ్ము లవలఁ గల్గె
ననెడు భావమె దీని రహస్యమండ్రు
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 33.

సీ. మొదలు నడుము తుది వదలియుంటివి పొంచి
యెచ్చట జూచుటో యెరుకపడదు
నామరూపగుణంబు లేమాత్రమును లేవు
యెట్లు లాహ్వానించు టెరుకపడదు
అవయవరహితుఁడవై యిట్లు వ్యాపింప
నెట్లుపాసించుటో యెరుకపడదు
యెల్లతావుల నిండి వృత్తులలోనుండ
నెట్లు నిన్నబట్టుటో యెరుకపడదు
గీ. దొరకకుంటివి విమలమతులకునైన
అప్రమేయుఁడ వౌదు వోసుప్రసిద్ధ
భక్తహృత్పద్మముల నిన్ను బట్టవచ్చు
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 34.

సీ. దూషించెదరు గాక దుర్మార్గు లగు జనుల్
వ్రణమందు నీగలు వ్రాలినట్లు
భూషించెదరు గాక పుణ్యాత్ము లిలఁ బుష్ప
మకరందమునుఁ గ్రోలు మధుప మట్లు
కాలేయకము వృథా క్రైక్రై యటంచును
మొఱఁగి ఛీ యన తోక ముడిచి పారు
నైసర్గికము మాన్ప నలువకైన వశంబె
దూషణాదులు వారితోడఁ బుట్టు
గీ. పరమమూర్ఖులతోడ సంభాషణంబు
కట్టె తెగగొట్టి పాములోన బట్టినట్లు
తోచువారల విడ్వాని తొలగవలయు
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 35.

సీ. కర్మమునను ముక్తి కలదు కర్తృత్వ
మావహించును ముక్తి కది విరోధి
సంతానమునసైన సాధించగారాదు
ధ్యానాదికమునకు నది విరోధి
ధనము మోక్షద్వారమునకుఁ బ్రత్యూహంబా
సదమలవిరతికి నది విరోధి
త్యాగమే మోక్షనిదానమై విలసిల్లు
త్యాగంబు వృత్తుల త్యాగమగును
గీ. నిశ్చితార్థులు సంన్యాస నియమశీలు
రగు యతీశ్వరు లాంతరగగనమందు
త్యాగులై కద బ్రహ్మతత్వంబుఁ గంద్రు
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 36.

సీ. సంకల్పనీడముల్ క్షణములోఁ గల్పించు
చిత్తశాఖికి రెండు విత్తనములు
తొలివిత్తనము ప్రాణముల స్పందనం బండ్రు
కర్మమే యది జన్మ కారణంబు
భావరూపం బైన వాసనయే శిష్ట
బీజము దానితో ద్వితయమగును
చిత్తద్రుమంబున జీవుడధిష్ఠించి
మిగుల దుఃఖఫలంబు మెక్కుచుండు
గీ. చటులగతి గల్గుఁ జిత్తబీజద్వయంబు
నొకటి నొకటిని వీడ్కొనకుండు నెప్డు
రెంటిలో నొంటి గ్రహియించ జంట విడును
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 37.

సీ. నీయందు సద్భక్తి నిశ్చలంబై యున్న
ముక్తికాంత వరించు మోదమునను
కరుణకై ధర్మార్థ కామము ల్వీక్షించి
ముకుళితకరముల మ్రోల నుండ్రు
బ్రహ్మేంద్రరుద్రాది ప్రముఖులు సర్వదా
కాపాడి సేవింతు రేపు మిగిలి
సర్వేశ్వరత్వాది సకలశక్తులు ప్రయ
త్నము లేక సిద్ధించుఁ దమకుఁ దామె
గీ. భక్తి మించిన పథము సంప్రాప్త మగునె?
స్మరణ మొదలిడి పూర్తి సమాధియగును
నీదు నామమె భక్తిసంపాదకంబు
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 38.

సీ. "అ"యను వర్ణంబున నగు సంజ్ఞ సౌమిత్రి
విశ్వభావనుఁ దాచు వెలయుచుండు
"ఉ"యను వర్ణంబున భయకంపములుఁ దోఁపు
శత్రుఘ్ను డను స్వతేజసఘనుండు
"మ"యను వర్ణంబున మాన్యుఁడు భరతుఁడు
ప్రాజ్ఞసంజ్ఞత ప్రభాభాసకుండు
అర్ధమాత్రాత్మకుం డను సంజ్ఞతో నీవు
ప్రత్యగాత్మ తురీయభావమైతి.
గీ. "ఓ"మితి బ్రహ్మ ప్రణవంబు భూమ మయ్యె
ప్రణవలక్ష్యార్థ మన రామబ్రహ్మ మయ్యె
రూఢి నీమంత్ర మోంకారరూప మయ్యె
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 39.

సీ. పరమపతివ్రతల్ భార్యలిర్వురు నన్ను
విడచి వర్తింప రేవేళలైన
ఆశామహాదేవి యనుఁగు నిల్లాలు నే
నెంత దెచ్చిన మూల్గి యీసడించు
నాకు నసూయ ప్రాణప్రియురాలయ్యె
నిరుగన్న పొరుగన్న నేవగించు
తరుణు లిరుగడఁ జేరి యురిడిపుర్వులరీతి
గులగుల లోలోన దొలుచుచుండ్రు.
గీ. కంటఁ బడువారి మ్రోలను గరము మోడ్చి
సిగ్గులజ్జలు వీడ్కొన సేయు నాశ
కాయమెల్లెడఁ గాల్చు నసూయకాంత
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 40.

సీ. కంజభవాండముల్ కందుకంబుల మాడ్కి
ద్రిప్పుచు మాయానిర్లిప్తు డెవఁడొ
పరగఁ గర్మజ్ఞానపక్షద్వయంబుచే
భక్తకోటి కెవండు ముక్తి నొసగు
తనదు నామాక్షరద్వయముచే దుస్తార్య
భవబంధము లెవండు పారఁద్రోలు
కర్మఫలాకాంక్ష గలిగించి మున్మున్న
గుడజిహ్వాన్యాయంబుఁ గూర్చు నెవఁడొ.
గీ. సత్యగుణవర్తి లోకైకచక్రవర్తి
ఇంద్రియాధీశ! భవనాశ! ఇందిరేశ!
అత్రికరధౌతవిమలపాదారవింద!
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 41.

సీ. గ్రహణాదిపర్వకాలమునందుఁ గోకోట్ల
దానంబు చేసిన దాని ఫలము
సకలనదులలోన సర్వకాలంబుల
స్నానంబు చేసిన దాని ఫలము
పదివేల వర్షము ల్సదమలకాశిప్ర
యాగాదివాసమహాఫలమ్ము
అశ్వమేధాదిమహాయజ్ఞములను శ్ర
ద్ధగ నాచరింపగా దాని ఫలము.
గీ. గల్గు ఫలసంచయంబుల గారణంబు
నీదు నామంబులోన నన్నియును నిమిడె
సకలసత్కర్మఫలములు సాధ్య మగును
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 42.

సీ. వృత్తి నిరోధించి దృష్టి నీపై నిల్పి
ఆసనసిద్ధుడై యాశ లుడిగి
గంగయొఘనను నిస్సంగుడై సమతతో
తైలధారవితానధ్యాత యగుచు
నిస్తరంగసముద్రనియతత్వమున మనః
పద్మమరందషట్పదము లీల
సద్యఃప్రసన్నత్వసత్కాంతు లీనెడు
యోగిభాగ్యంబున యునికిఁ గల్గి.
గీ. చంద్రికలళను గ్రోలుచు సాంద్రముగను
గన్ను లానందబాష్పము ల్గ్రిందుకొనెడు
ఆత్మసామ్రాజ్యభాగ్యంబు నందు టెపుడొ
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర! . 43.

సీ. విష్ణుసహస్రము ల్వేయిరెట్లు ఫలంబు
ఒకపరి నీనామ ముచ్చరింప
కొండంత కష్టముల్ గోరంతగా తగ్గు
నొకపరి నీనామ ముచ్చరింప
సకలవాసనలు తక్షణమున క్షయ మగు
నొకపరి నీనామ ముచ్చరింప
జ్ఞానవిజ్ఞానరత్నములుఁ బయల్పడు
నొకపరి నీనామ ముచ్చరింప.
గీ. మొట్టమొదలంట వృత్తి నిర్మూల మగును
'అహము బ్రహ్మాస్మి' యనెడు వాక్యార్థ మగును
నీదు నామమహిమ నెన్న నాదు వశమె
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 44.

సీ. తన పొట్టకై ప్రస్థమను నగు ధాన్యంబు
గాని సంపాదించుఁ గరశలాది
త్రావుటకై యొక్క తవ్వెడు క్షీరము
ల్చాలు నైనను బెంచు నాలమంద
పర్యంకమున నర్థభాగంబు తన సెజ్జ
యగునైన మంచము ల్కెగల సంఖ్య
వసతికై యొక యిల్లు వాకిలి చాలును
గాని సౌధము లెన్నొ గట్టుకొనియె.
గీ. పరవిభూతుల కిటుల తాపత్రియంబు
పడుచు జలకీటకము నిటిసుకుల గూలి
నటులఁ గూలును ముక్తిలే దోల నైన
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 45.

సీ. కరము విశేషించి పరువు నొట్టట యుద్భ
తంబని గొప్పగాఁ దలఁచఁబోకు
హృదయగోళమునుండి విదళించి పర్వెన
బలశాలి వని నిన్ను బరిగణింతు
ఏకంబుగా సుప్రతీకంబుచేఁ బట్టు
వడఁక సుత్క్రమణుడ వౌదు వీవు
అంజలి గుదిఁ జిక్కి యంజవేయక నోప
వదియె నిన్బట్టెడిఁ గుదుల త్రాడు.
గీ. గాన నంజలిగుదులచేఁ గట్టినైతొ
బంధ ముడిపిన నీప్రతిబంధ ముడుఁగు
వాయనమ్ముల నుడి వసుధలోన
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 46.

సీ. కుక్కతోఁకకుఁ గొక్క గొట్టం బమర్చుచు
పదియేండ్లు లగుదాక పదిలపరచి
చిరమునఁ దొలగించి మరల వీక్షించిన
ముడుదలు వడి చుట్టు పూర్వమట్ల
విషయ మింద్రియముతో విరహితంబైన-తో
చిత్తనైర్మల్యంబు జెడక యుండు
విషయేంద్రియంబులు విడువడకుండిన
వర్షతరంగిణీ వడువుఁ దోఁపు.
గీ. పుట్టుకతోఁ బుట్టు గుణములు పుడకలందు
బోవు నను సామెతగ కుక్క పోల్కినయ్యె
సహజములు మాన్ప నేరికి సాధ్య మగును
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 47.

సీ. చావుపుట్టువులను జాడ్యమ్మునకు మందు
పుట్టతేనియ యండ్రు మునిజనంబు
శ్రవణపుటములతో సర్వదా మధువును
గ్రోలుచుండిన వ్యాధి కుదురుపడును
పుట్ట వాల్మీకంబు బుట్టిన మధు వన
రామాయణంబు నిరామయంబు
జన్మజరాదులు సంసృతిబాధలు
సోపద్రవంపువిషూచివ్యాధి.
గీ. ధ్వంస మొందుచు మొలకలెత్తక నశించు
రామకథ జొర శ్రవణసారంగములను
భళిర నీకథమహిమనుఁ దెలియ వశమె
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 48.

సీ. అవివేకికిని భార మధ్యాత్మశాస్త్రంబు
రాగవంతునకు వైరాగ్యగుణము
శాంతిహీనునకు సుస్వాంతమే భరమగు
కాముకునకు నేకాంతభూమి
అజ్ఞానజనులకు నాత్మవిజ్ఞానంబు
సంశయాత్మునకు నిశ్చయమనీష
ఆశాపిశాచ మావేశమయ్యెడు వాని
కెడలేని భారంబు తృప్తిఁగనుట
గీ. తగని భారమ్ము గ్రుడ్డికి దర్పణమ్ము
భాషణము వైష్ణుకునకు భార మరయ
నీదునామంబు భారము నీచులకును
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 49.

సీ. నీపదభక్తిచే నెగడుచుండును విరక్తి
ముక్తి దోహదముల మూలమగును
నీపదభక్తిచే నెగడును జ్ఞానంబు
కైవల్యమున ముఖ్య కారణంబు
నీపదభక్తిచే నెగడును గర్మంబు
చిత్తశుద్ధికి మహాశ్రేష్ఠతరము
నీపదభక్తిచే తాపత్రయమడంగు
త్రివిధశాంతులకు సుదీపకంబు
గీ. భక్తిగలిఁగిన జీవుని భారముడుఁగు
భక్తిసద్యోవిముక్తికి పరమయుక్తి
భక్తి తారకమంత్ర శబ్దార్థమగును
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 50.

సీ. అంతర్బహిఃస్ఫూర్తి నధిగమించినవాని
కుద్వాసనం బెట్టు లూర్జితంబు
స్వప్రకాశవ్యాప్తి సహజోద్భవం బన్న
నీరాజనం బెట్లు నిహిత మగును
సద్వాసలు గ్రమ్మి సమత వహింపఁగా
ధూప మేరీతిని బ్రాపుగాంచు
సకలజీవావళి సంరక్షకున కేల
అర్ఘ్యపాద్యనివేదనాదికంబు
గీ. అద్వయున కెట్లు మ్రొక్కుట యలసునట్లు
తరమె దరిలేనివాని ప్రదక్షిణంబు
మది తలంపుల కందైన గొడువక్కగలదె
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర! 51.

సీ. బంధమోక్షములు నీయందు లేవనియందు
రట్లు కాదన్నచో నడుగవలెను
బంధమా మోక్షమా ప్రథమమునం గల్గె
బంధమే పూర్వ మాపైని మోక్ష
మట్లన్నచో బంధ మావల కేగి మో
క్షమువచ్చు మధ్య నాక్షణము నేమి
స్థితియగుఁ జెప్పుడీ త్రితయంబు నంటిరే
వ్యాఘాత మగు మీదు వాక్యమునకు
గీ. గాన తద్వయరహితమై క్రాలుచుండి
వృత్తులకు మధ్య స్వయమున వెల్గుచుండు
నదియె వ్యాపకచైతన్య మదియె నీవు
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 52.

సీ. మలమూత్రసంయుక్త మాతృగర్భములోన
బొదిలి దుఃఖించుట మొదటి యేడ్పు
బలవంతమున భూమిపైఁ బడి యజ్ఞుఁడై
దినదినగండంబు గనుట యేడ్పు
కామాదిరేచుకుక్కల మధ్యమున జిక్కి
యొడ లెరుంగని వయస్సుంకు యేడ్పు
వృద్ధాప్యమున వటవృక్షానుకారియై
ముదిరి రోగాదుల మూల్గు యేడ్పు
గీ. ఔర! సంసారమే యేడ్పు లగ్రహార
మగును యేడ్పులచేఁ గొంతు పగిలిపోయె
యేడ్పు రాకుండ నౌషధ మిచ్చి బ్రోవు
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 53.

సీ. కృతయుగంబున మును ధృతి నాతపంబున
సగుణమూర్తిధ్యానసక్తులైరి
త్రేతాయుగంబున ధీరులై యజ్ఞాది
క్రతువులచే మోక్షకాములైరి
ద్వాపరమున రూపు నాపాదన మొనర్చి
అర్చకులైరి ప్రత్యక్షముగను
కలియుగంబున సౌఖ్యకరమగు స్మరణచే
సులభంబుగను మోక్ష ఫలితులైరి
గీ. శీఘ్రఫలదంబు కవియె లక్ష్మీకరంబు
అఘము లున్మూలమగు నిరాయాసముగను
యేల నిందింతురో కలి నెరుకపడదు
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 54.

సీ. ఇక్షుఖండమును బరీక్షించి వీక్షించి
గుడశర్కరాదులఁ బడయగలము
తిలలందు దైలంబు వెలువడు గ్రావాగ్ని
నించు గాఢమున మర్దించి చూడ
పాషాణమును గొట్టి పటుబాహుశక్తిచే
ఇనుమును గాని గ్రహియింపవచ్చు
గోదుగ్ధకర్షణ ఘూర్ణాయమానమై
దధిని జిల్కి ఘృతంబు దనియ వచ్చు
గీ. జ్ఞానవహ్నిని పురిగొల్పి మానసమున
నేతి యని తత్త్వములను తృణీకరించి
ఆత్మ గన వచ్చు స్వీయదేహంబునందె
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 55.

సీ. మహినిఁ బ్రత్యక్షమౌ మాయాప్రపంచంబు
శాస్త్రార్థమున విశసనము నగును
అపరోక్షమునను గార్యక్షమంబు నశించు
దశముఁడైనట్లు యథార్థముగను
ప్రారబ్ధము నశించ ప్రతిభాననాశంబు
గల్గు నన్యోన్యమై క్రమము గాను
త్రివిధరూపములను దేజరిల్లెను స్వాత్మ
మాయ యీవిధమున మాయమగును.
గీ. మాయ లేకున్న పుటపాకమగు సువర్ణ
మైన మాక్షికి మలినగుణాదు లెల్ల
లయము బొందిన నీరూపు బయలువడును
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 56.

సీ. తలఁమి తిట్టుడి వాని దరిఁజేరి యడుగును
ఆత్మనా తుచ్ఛదేహమున నగును
ఆత్మ నే యని పల్కు యందరికిని నాత్మ
సమమాటచే మతిభ్రమణుఁ డండ్రు
దేహమునే యని సాహసించి వచించ
ప్రతిపక్షి కక్షి నాపక్ష మగును
ధరలోన నష్టసంతానసంపాదన
పరుల కానంద సంప్రాప్తి కొరకు.
గీ. దూషణంబునఁ బొందు సంతోషణంబు
కష్టపడనట్టి మనకు సదృష్టఫలము
తిట్టుకొనుగాక వారి యభేచ్ఛగాను
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 57.

సీ, అయమాత్మ బ్రహ్మంబు నను మహావాక్యమే
యాథర్వణంబని బోధ చేసె
ప్రజ్ఞాన మగు మహా బ్రహ్మవాక్యము గాంచ
ఋగ్వేదజనితవి జృంభణంబు
బ్రహ్మాస్మి యను మహావాక్య ముచ్ఛనమయ్యె
వివరింపగా యజుర్వేద మందు
తత్త్వమసి యను పదార్థమహావాక్య
మది సామవేదమం దవతరించె.
గీ. మొదటివాక్యమ్ములగు మూఁడు బోధగల్గు
నాలవది యనుభవమును నై వెలుంగు
అన్నియును బ్రహ్మనిర్దేశ మైమెగడంగు
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 58.

సీ. భూలోక మొక గొప్ప భూతవైద్యగృహంబు
రోగహారకు డీశ్వరుండు దలప
అజ్ఞాన మున్మాద మగు పిచ్చిరోగంబు
రూఢిసంసారులు రోగిజనము
ఎల్లరు పిచ్చివారే యటం చెఱుఁగక
పైవారి వెఱ్ఱని బరిహసింతురు
వ్యాధిపీడితు లౌచు బాధ కోర్వఁగ లేక
తమ భిషగ్వరు చెంతఁ దగ వసింతురు.
గీ. భయము మందిచ్చి భక్ష్యానుపాన మొసఁగి
నిర్గతులఁ జేసి దయ నపవర్గ మిచ్చి
విడుపు చేసెడి వైద్యుఁడ వీవె కావె
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 59.

సీ. సద్వృత్తినిరోధసంస్కారఫలితమే
ఘనులు ప్రాణాయామ మని వచింత్రు
దృశ్యప్రపంచపుదృష్టి నిషేధంచు
టే, రేచకం బంద్రు వృత్తిలోన
'బ్రహ్మాస్మి' యను వృత్తి బడసినచో వాయు
పూరకాఖ్య దనర్చు పూజ్యముగను
పూరకాభ్యాసంబు పూర్ణమైనను దాని
కుంభకం బంద్రు సద్గురుజనాళి.
గీ. బుద్ధిశాలురకు నిది సంబోధ్య మగును
ఘ్రాణపీడన మజ్ఞులకై విధించె
యోగసాంఖ్యంబులకు ఫలం బొకటికాదె
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 60.

సీ. చిత్రార్పితం బైన పాత్రిలో నున్నట్టి
యమృతంబు నిజమైన యమృత మగునె
చిత్రానలంబు వీక్షింపగా వహ్నియై
స్ఫుటరూపకీలఁగాఁ జూడబడునె
చిత్రార్పితంబైన స్త్రీవిగ్రహముఁ గన్న
మిథ్యగా దోఁపక తథ్య మగునె
స్వప్నగతంబైన జగము లెల్లను సుప్తి
నుత్థితంబై చూడ సిద్ధమగునె.
గీ. జగము, జీవులు చిన్మాత్రజలధియందు
వితథమైనను ప్రత్యక్షవిధము దోఁచె
నీవె భాసకభాస్యంబు నీవె నిజము
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 61.

సీ. ఆధులచే బాధ వ్యాధులచే బాధ
బెంగలలోఁబడి క్రుంగుబాధ
ఆఁకలిచే బాధ జిహ్వాదులచే బాధ
ధనము సంపాదింప తగని బాధ
మానహీనంబైన మానసికపు బాధ
ఇచ్ఛాదులందు పరేచ్ఛ బాధ
మధ్యమధ్యను గ్రొత్తమార్పులు గల బాధ
అంతమందున నొప్పగింత బాధ
గీ. ఉన్న యెడ బాధ లెన్నెన్నొ యుప్పతిల్లు
గాని లేకున్న నొక్కటే లేనిబాధ
జన్మ మన్నిటికిని బాధ జగతిలోన
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 62.

సీ. పరమపవిత్రమై వఱలెడు క్షేత్రంబు
కాశీశరీరమై గణన కెక్కు-
త్రిభువనపావనీ తీర్థరూపిణి జ్ఞాన
గంగయే భ్రూయుగసంగి హార్దము
భక్తిశ్రద్ధాఖ్యలై వర్తించుటే గయ
గురుపదధ్యాన మందురు ప్రయాగ
సకలమనంబుల సాక్షి యంతర్యామి
విశ్వేశుఁడు తురీయ విలసితుఁడు
గీ. అఖిలతీర్థములును దేహమందు నిమిడె
తీర్థములు పొందఁ జగతిని దిరుగ నేల
వ్యర్థ మా గమన మది యేమి సార్థకంబు
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 63.

సీ. స్త్రీ లన్నపానాది చిత్రభోగేచ్ఛల
జాగరుఁడై బైట సంచరించు
తైజసుండై పదార్థములను గల్పించి
స్వప్నాంతరప్రజ్ఞ సహితుఁడగును
నయమున నానందమయుఁడై సుషుప్తిని
వెలసి యవిద్యలో విలయమందు
త్రైవిద్యచక్రముం దగిలి యారీతిని
జాగ్రదాదుల నాత్మ సంచరించు
గీ. అతఁడె బ్రహ్మాండ సృష్టికి నాయతనుఁడు
కార్యకారణోపాధులు గల్గువాఁడు
సమ్మతిని తద్వయము వీడ సాక్షియగును
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 64.

సీ. కామంబు శ్రీమోక్షకాంతపై యగుఁగాక
క్రోధంబు పాతకగుణమునందు
ధరఁ లోభగుణము త్వచ్ఛరణయుగ్మమునందు
మూర్తిధ్యానమున సమ్మోహగుణము
మదము సంప్రజ్ఞచే మైమరపున గల్గు
గాక నిశ్చింతగాఁ గ్రాలుచుండి
మాత్సర్యగుణముపై మత్సర మగుగాక
ఉష్ణ ముష్ణమ్మున నుడిగినట్లు.
గీ. శత్రుషట్కకృతంబులు మిత్ర మగుచు
సంభవించెను నీయందె సత్వరముగ
విడువఁగాలేను కామాదివిసరములను
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 65.

సీ. రాముఁడు బ్రహ్మంబు లక్ష్మణుఁ డానంద
రూపుఁడు సీత చిన్మాత్రకాంత
ఆభాస మారీచుఁ డతఁడె హరిణము
రామ గైకొనఁగ శ్రీరాముఁ బంచె
కపటి రావణుఁ డహంకారంబు ప్రకృతిని
వంచకుఁడై లంకనుంచె నతఁడు
భక్తి సామీరి చిత్ప్రకృతిని సమకూర్చి
మరల బ్రహ్మానంద భరితుఁ జేసె.
గీ. అదియె రామాయణ రహస్యార్థ మగును
కథను వినినంత ధర్మమార్గమ్ము గల్గు
నామమంత్రంబు భక్తుల జ్ఞానఫలము
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 66.

సీ. అహమాదివృత్తుల నభివృద్ధి గనఁజేయు
గర్మయోగము ఫలాకాంక్ష గల్గి
జ్ఞానముచే నభిమానవృత్తి నశించు.
ఫలకాంక్షసంచయ ప్రళయవహ్ని
కాలాంతరమునందు గర్మఫలం బిచ్చు
ప్రత్యక్షమున జ్ఞానఫలద మగును
అతికష్టమున సాధ్యమగుఁ గ్రియ సఫలంబు
సులభసాధ్యము జ్ఞానఫలమనంగ
గీ. నీడ కెనుబోతు నెండలోనికిని నెద్దు
సరణి కర్మము జ్ఞానము ల్సమముకావు
మానుగను * నేవకారము జ్ఞానమునకె
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 67.

సీ. అది కట్టినట్టైన నన్నియును గట్టు
జనులార వినుఁడని చాటెనొకఁడు
ఏది కట్టిన నది యేమాత్రమునుఁ గట్ట
దని వాని వెంట నంటెను నొకండు
ఇరువురు ప్రచురించి పురిసత్తరువుఁజేర
సతి యడిగెను చరిత్రవినగ
అది యన స్త్రీయని మొదటివాఁడు పల్కె
వ్యతిరేకముఖుఁడది ప్రతిఘటించె
గీ॥ దృష్టి మరలించి యాత్మపైఁ దృష్టినిడిన
కాంతపై యాస కట్టు నిర్హేతుకముగ
ననుచు బేర్కొని మూడవ యతిథి పల్కె
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 68.

* జ్ఞానా దేవతు కైవల్యం

సీ. చంద్రార్కవిలసిత చంచలాయతనేత్ర!
ఆకారరహిత! సీతాకళత్ర!
దిక్సంచయశ్రోత్ర! ధీలయకరపాత్ర!
బ్రహ్మాండమయగాత్ర! వరచరిత్ర!
లయకాలపర్యంకరాజితవటపత్ర!
భానువంశపవిత్ర! ప్రథితగోత్ర!
అవ్యక్తపర్యంత మాపాదితక్షేత్ర!
భక్తజనస్తోత్ర! ప్రాణిసూత్ర!
గీ. పఙ్క్తిరథపుత్ర! భానుజభవ్యమిత్ర!
భవభవానీకృతస్తోత్ర! ప్రథనజైత్ర!
భక్తవనచైత్ర యుపనిషత్పద్మమిత్ర!
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 69.

సీ. సవిరళంబై యొప్పు కువలయం బెల్లను
గాలుని సొగటాల పాళిఫలక
పురములు గళ్ళు బొంపిరి యాటలకు నిళ్ళు
ఆటకాయలు ప్రాణికోటులెల్ల
బహుళములగు రాత్రిఁ బవలును పాచికల్
లోలుఁ డాటలకుఁ గాలుఁడు ఘనుండు
ఒక్కొక్కగదినిడుఁ బెక్కుకాయలు నైన
హాని వృద్ధులు గల్గు నంతమునను
గీ. కాలపురుషుఁడు కాళితో ఘస్మ్రతలమున
పందెములు వైచి చేతన బంధకముగ
దగిలి క్రీడించు నన్నందు దగులనీకు
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 70.

సీ. తండ్రి శ్రీరాముండు తల్లి సీతాదేవి
కాపురస్థల మయోధ్యాపురంబు
హనుమానుఁ డాశ్రయుం డనుయాఖ్యమై యొప్పు
పూజ్యుఁ డాతఁడు కపిపుంగవుండు
నీలసుగ్రీవాది నిఖిలాప్తబృందంబు
సంతతాశ్రయము ధీమంతులెల్ల
చదువులు చదివించు శాస్త్రజ్ఞులగు ఋషుల్
ఘనులు వసిష్ఠాదిమునిజనంబు
గీ. దివ్యతరమైన సరయూనదీజలంబు
స్నానసంధ్యాజపాద్యనుష్ఠానవిధము
ఏమి లోపంబు సుఖముల నిహపరంబు
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర! . 71.

సీ. దేహంబె యాత్మగా దెల్పుదమంటిమా
మరణాద్యవస్థల మాయ మగును
ప్రాణంబె యాత్మగా వచియింత మంటిమా
జడము చలనము తత్సహజగుణము
మానసం బాత్మగా మన్నింత మంటిమా
క్రొత్తసంకల్పము ల్లోనల దేరు
బుద్ధియే యాత్మగా బోధింత మంటిమా
క్షణికమా జ్యోతిరింఖణము తెరవు
గీ. అహమునకుఁ జిత్తమునకు సత్త్వై యగును
కాదు కాదని నేతి వాక్యముల కలన
దివ్యమైనట్టి తెలివిని దెలియవలెను
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 72.

సీ. దేహనాటకశాల దేశస్థధీసాక్షి,
స్వప్రకాశకదీపసరణి వెల్గు
ప్రభు వహంకార మభావకల్పనరూపి
కాంత నటీచమత్కారి కుమతి
ఇంద్రియబృందముల్ నృత్యకాంతుఁ బ్రక్క
తాళమృదంగసధ్వనుల యంగు
శబ్దాదివిషయము ల్సభ్యులు వీక్షింప
చిత్రనాటకము నిశ్చేష్టు లగును.
గీ. కాంతు లేనను దీపపు కళికభాతి
సకలసంబంధరహితమై సాక్షి వెల్గు
గాని యజ్ఞులు సాక్షినిఁ గర్తయందు
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 73.

సీ. వాయువుచే వాయు వంతరిక్షము నందు
గదలునట్లుగ నిచ్ఛ యుదిత మయ్యె
బిందువికాసంబు నొంది వ్యక్తము గాక
జ్ఞానశక్తి జనించె నాదకళల
విపరీతముగ బంధత్రిపుటి జ్ఞాత్రాదుల
వ్యక్తమై ఘనక్రియాశక్తి నెడలె
ఇచ్ఛ జ్ఞానక్రియ లిచ్ఛంగి దసరార
తత్త్వస్థితు లగు సదాశివుండు.
గీ. ఈశ్వరుఁడు హేమగర్భుఁడు శాశ్వతముగ
చక్రకోణంబులకు నధిష్ఠాత లగుచు
కారణబ్రహ్మవైరి తత్కల్పనలకు
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 74.

సీ. ధనధాన్యముల్ కొట్ల తన శిశువులు తొట్ల
గోవు లరుపులు కట్టు గొట్టములందు
రుణపత్రములు పెట్టె లినుప పెట్టెలయందు
నున్నత సౌధంబు లున్నచోట్ల
భార్య వాకిటి ప్రక్క ద్వారపర్యంతంబు
ప్రేతభూమిని స్నేహబృందములును
దేహంబు చితియందు దాహమందగ బంధు
జనములు తమతమ స్థానములను
గీ. యెచ్చటచోటనే యుందు విచ్చలవిడి
నొక్క నూతన ధర్మమే ప్రక్కతోడు
మరణవేళల సత్య ధర్మమహిమ భళిర
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 75.

సీ. శ్రవణమున న్పరీక్షితుండు మోక్షగుండయ్యె
లలి నామమునను బ్రహ్లాదుడలరె
అంజనీసుతుండు దాస్యమున సరసిలో
నార్తయై గజము నిరాశచేసి
కర్తృత్వరహితయై కాంత ద్రౌపది బంధు
రీతి నర్జునుండు సుగ్రీవుండతుల
విహితుడై యాత్మనివేదనంబున బలి
సాధించె శ్రీవిష్ణు సన్నిధిగను
గీ. లక్ష్మి యక్రూరశ్రీశుకులాది భక్త
నారదశబరిప్రభృతులు జ్ఞానధనులు
ఇలను నిను గొల్చియే తరియించినారు
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 76.

సీ. గంగిరెద్దునుఁ దగు శృంగార మొనరించి
జిగితాళ్ళ నాసిక బిగియఁగట్టి
ఇంటింటఁ ద్రిప్పెడు నెద్దుభంగిని సదా
పురుషుఁడు స్త్రీవెంట దిరుగుచుండు
విషయానురాగ దుర్విలసితయురుపాశ
బద్ధుఁడై యువతుల బారిఁజిక్కి
ఆటలాడు మటన్న నాడుచుఁ గామాది
రజ్జుపాశముల నిరంకుశముగ
గీ. యురులలో పీక బిగియంగ నరశవంబు
గతిని వహియించి శిరము సంతతము వడఁక
బంధమును వీడ దెంత నిర్భాగ్యదశయొ
'రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 77.

సీ. కాషాయవస్త్రమ్ము గట్టినమాత్రాన
నాత్మజ్ఞుఁడైన సన్యాసిగాఁడు
దండకమండల ధరుఁడైన యంత నే
అనుభవియైన సంన్యాసిగాఁడు
యజ్ఞోపవీతమ్ము నాతుఁడై వీడ
పాశముక్తులను సంన్యాసి సంన్యాసి గాఁడు
ఆసనసిద్ధుఁడై యగ్నిముంగలనున్న
అంతరవిషయసన్యాసి గాఁడు
గీ. జగతి నైరాశ్యభావంబు శమము దమము
తత్త్వబోధము ధ్యానాది సత్త్వగుణము
రాసియైనట్టిమూర్తి సన్యాసిగాని
'రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 78.

సీ. వార్ధక్యమున యందు వైద్యుల దెప్పించి
తండ్రి రక్షణకు నై తనయుఁ డగును
కాలు సేతులు వంగి కన్నుఁ గానని వేళ
భార్య స్వసేవకై పనికివచ్చు
జ్ఞాతియు లగువారు శవదాహ మొనరించి
యాలిబిడ్డలను నోదార్చఁగలరు
బంధుసమూహము ల్పదియవనాడు తి
లోదకంబుల నిచ్చుచుండఁగలరు
గీ. అనుమఁ దలఁచుచు దంతువు లల్లుకొనెను
క్రిమివిధం బౌటయె గాని పృథ్విలోన
గట్టుదిట్టము లేమైనఁ గార్య మగునె
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 79.

సీ. క్షేత్రజ్ఞపురుషుఁడు శ్రీకృష్ణుఁ డతిభోగి
అకలంకవర్తి శ్రీశుకుఁడు త్యాగి
పృథివిపాలకు లగు మిథిలేశరాఘవుల్
నిపుణులై పాలించు నృపయుగంబు
అష్టాంగయోగవిద్యల మర్మవిదుఁడైన
శిష్టుఁడు గర్మి వశిష్ఠమౌని
భక్తుఁ డగు లఘిమాదిపరిపక్వసిద్ధుఁడు
బ్రహ్మపుత్రుండు నారదుఁడు యోగి
గీ. ఉక్త షట్కమునకు మోక్ష మొక్కసరణి
నొప్పు వ్యవహారదశను నెట్లున్న నేమి
అంతరారంభవర్జితస్వాంతు లగుచు
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 80.

సీ. వేదాంతవేదియై భిక్షాశనుండైన
కౌపీనధారి లక్షాధికారి
తరుమూలవాసియై ధాత్రిశయుండైన
కౌపీనధారి లక్షాధికారి
కర్పూరాదులవలెఁ గనగాదులను జూచు
కౌపీనధారి లక్షాధికారి
అనవరతంబు బ్రహ్మమునందు రమియించు
కౌపీనధారి లక్షాధికారి
గీ. శమము వహియించువాఁడె లక్షాధికారి
కామి కాకున్నవాఁడె లక్షాధికారి
కాంక్ష ధనవంతు డెప్డు లక్షాధికారి
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 31.

సీ. అది నాది, ఇది నాది యనెడు మమత్వమే
తతశోకశంకు సంస్థాపనంబు
తత్త్వజ్ఞుఁ డసమానధర్మాత్ముఁ డను యహం
భావ మెక్కుడి నట్టి ప్రక్కయమ్మ
తనయు లన్నలు బిడ్డదారలపై ప్రేమ
కాళ్ళకు నిడుపసంకెళ్ళ గుదులు
అభిజనధనవిషయాదికగర్వంబు
పరివేష్టనంబైన యురుల చిక్కు
గీ. మొదలు శుభముగఁ గన్పట్టు మోహలతలు
తుదిని కాలభుజంగంబు తోయ మగును
గొంతుకలు నూలిపోవులఁ గోసినట్లు
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 32.

సీ. సుతుఁ డహంకారంబు చుఱ చుఱ మని మండు
కాష్ఠాగ్నివలె సదా గాల్చుచుండు
విత్తమే భ్రాంతమై వెతలు బెట్టుచు నుండు
పలువుర కాళ్ళను బట్టునట్లు
కామాదిశత్రువర్గములు బంధుజనంబు
మోహమందిరము కాపురము చోటు
ఆభాసకర్మఫలాస్వాదమోదిమై
కాంత యాశయె బిగ్గ కౌగలించు
గీ. సిగ్గులజ్జలు పుత్రిక లెగ్గు గల్గు
దంభదర్పాదిస్నేహబృందములు భువిని
దుష్టసంసారవర్గము తోఁపఁ జేయె
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 83.

సీ. ఘనమనోరాజ్యంబు గడెగడెకు మారు
వివిధమై యాత్మల విధముఁ దోఁప
బాల్యము లేదు యౌవనమందు స్థవిరత్వ
మున గన యౌవన మనగ లేదు
మృతుడైన పితరుఁడు వెతకిన మరి రాఁడు
గతదినము పునరాగతముఁ గాదు
ఆవిధంబున బహిర్వ్యాపారములు తోఁచు
జలబుద్బుదంబు చాడ్పు నగుచు
గీ. స్వప్నవిధ మగు వ్యవహారసముదయంబు
కల్గు పరమార్థ మని దాని కథన మెట్లు
తిరము జగ మని నుడివి సాధించు టెట్లు
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 84.

సీ. బ్రహ్మపదవి తృణప్రాయంబుగా నెంచి
రాగి కాకుంట వైరాగ్యయవధి
దేహాత్మవలె బ్రహ్మాదీసమంబై యున్న
పురుషార్థ మగు పూర్ణబోధ కవధి
సుప్తిస్థునకు బహిర్జ్ఞప్తి లేని విధంబు
రతుల విస్మృతి యుపరతికి నవధి
అంతంతకును నెంత యభ్యస్త మయ్యెనో
యెంచి తానే పరీక్షింపవలయు
గీ. మూట నొక్కటి బోధయే ముఖ్యమగును
బోధ లేకున్న జీవనము క్లిష్టము
గల్గునైనను మోక్ష మొక్కటి కొఱంతె
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 85.

సీ. పరోగము లేక నారోగ్యభాగ్యమ్ము
గన రాజయోగభాగ్యమ్ము వెల్గు
భువిని స్వచ్ఛందమై వ్యవహారములు బర్వ
మెట్ట వేదాంతంబు లుట్టిపడును
తులలేని యైశ్వర్యములం దూగుచుండిన
నుపరతిం బలుకులు నోలుకుచుండు
నిళ్ళు వాకిళ్ళు కుమాళ్ళు క్షేమంబైన
నీతుల సొరకాయ కోత లెగురు.
గీ. కష్ట మొక్కింత యెరుం గని కాలమునను
సకలవేదాంతములు తన సాధ్యమైన
బాగుల చిత్తంబు వేదాంత మెగిరిపోవు
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. ౮౬.

సీ. భవరోగహరమైన పరమాత్మబోధంబు
మర్దించినట్టి చిన్మాత్రఘుటిక
పరదారవిషయాదిపంక్తులపై దృష్టి
ప్రత్యాహరించుటే పథ్యనియతి
అనుపానవిధిభక్తి యవ్యభిచారిణి
జీవుఁడు రోగి దుశ్చింతకుండు
గురుఁడు వైద్యుఁడు సత్త్వగుణశీలి జీవుని
బోధచే బంధనిర్ముక్తుఁ జేయు.
గీ. మాయరోగమ్మునకు నెడ మీయకుండ
ఔషధము మ్రింగి కఠినపథ్యమ్ము చేసి
జీవుఁ డారోగ్యస్నానంబు సేయుగాత
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 87.

సీ. తుల లేని దుఃఖహేతువు తుచ్ఛదేహంబు
కర్మఫలము దేహకారణంబు
కర్మోద్భవంబు రాగము గల్గినం గల్గు
మనమె రాగమునకు జనక మగును
మానస మవివేకతానకంబుఁ దలంప
నవివేక మజ్ఞాన మాశ్రయంబు
అజ్ఞానలయము తత్త్వజ్ఞానమున నొప్పు
స్వవిచారణంబు తజ్జనకమూల.
గీ. మొదము గల్గిన నజ్ఞానవృక్షశాఖ
లలముకొని దుఃఖవైషమ్యఫలము లీను
జీవునికి తత్ఫలములునుం జీవికములు
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర! 88.

సీ. తిలలు కడిగిన యట్లు మలిన మత్యంతమై
బ్రహ్మవి త్పురుషు ప్రారబ్ధ మగును
బ్రహ్మవి ద్వర్యుని ప్రారబ్ధ మొక్కింత
యడగి బియ్యపు కడుగట్లు దో
లీలగా నుండు నరీయు ప్రారబ్ధంబు
దగ్ధపటన్యాయతను బరంగు
శాస్త్రాస్థితుండు విద్వరిష్ఠు ప్రారబ్ధంబు
స్వచ్ఛమైన జలంబు సరణి నుండు.
గీ. జగము స్వప్నము విదునకు చంద్రికవలె
వరునికిని దోచు నిశి దృష్టి వలెను భువిని
త్రితయునకు గాని యదిగూడ దెగును తుదిని
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 89.

సీ. శ్రీరామమంత్రంబు చిత్తశుద్ధికరంబు
భవభయహరము పావనము ఘనము
శ్రీరామమంత్రంబు శ్రీవిద్యచక్రంబు
బిందునాదకళాత్మ బీజకంబు
శ్రీరామమంత్రంబు క్షేత్రజ్ఞ రూపంబు
భక్తరక్షక దేవ పాదపంబు
శ్రీరామమంత్రంబు క్షితియోగయంత్రంబు
సకలవాంఛాఫలసాధకంబు.
గీ. రామమంత్రంబు సజ్జన రంజకంబు
రామమంత్రంబు నమృతధారావృతంబు
రామమంత్రమె నీమూర్తి రవికులేంద్ర.
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 90.

సీ. సందేహసలిలంబు సంకల్పవీచికల్
తీర మాశయె యసంతృప్తికరము
మానసకాసారమగుఁ గామనక్రంబు
భ్రమజనకంబు పిపాసగుణము
ఇంద్రియార్థము పుష్ప మిరుపక్క దళములు
కామకోపము లహంకారనళి
గజము జీవుఁడు పదగ్రహణంబు బంధంబు
నక్రవధంబె యజ్ఞాననాశ.
గీ. మదియె గజరాజమోక్ష మధ్యాత్మకంబు
పుష్పములు దీయకుండగా మున్గు నతఁడు
మోహరహితుండు జీవన్ముక్తుఁ డగును
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 91.

సీ. బంధువులను జూచి పరతెంచు శీఘ్రమే
యని భార్యతోఁ జెప్పి చనఁగవచ్చు
తీర్థయాత్రల జన్మ సార్థకత్వము గొంత
కతిపయదినములఁ గలుగవచ్చు
పరదేశవాసియై చిరకాలమున కైన
జిరుతలమరువునఁ జేరవచ్చు
నటు లెంచి జగతి నత్యాశతో విహరించి
యుండుట సహజమై యుచిత మగును
గీ. గాని ప్రాణము విడచిన మానవుండు
వెళ్ళుటయె కాని గ్రమ్మఱ మళ్ళ లేఁడు
ఒప్పగింతలు పెండ్లి మహోత్సవములు
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 92.

సీ. నారాయణుఁడు, బ్రహ్మ, వారాహ నారద
కపిలదత్తాత్రేయఘనసుయజ్ఞు
లురువిక్రముఁడు పృథుఁ డూర్జితచరితుండు
మీనకూర్మములు నమృతకరుండు
మోహనుండు నృసింహమూర్తి వామనుఁడును
రాముఁడు వ్యాసశ్రీరామమూర్తి
బలరామకృష్ణులు బరగ బుద్ధుఁడు కల్కి
తులలేని శుభసంతతులుగ వెలసి.
గీ. ఏకవింశతిరూపమ్ము లిట్లు బూని
ధర్మవిరహిత మయ్యెడు తరుణములను
నిల నవతరించి ధర్మంబు నిలిపినావు
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 93.

సీ. పసుపు దుప్పటిఁ గప్పి బలువైన చర్మము
పసుపుతైలముల లేపన మొనర్చి
మెడకు మువ్వలగుత్తి వడిగల శృంగమ్ము
లకు నిత్తడితొడుగులను దొడంగి
వేపకొమ్మలు బూని వెనుక పామరమూఁక
యిటు నటు కుప్పించు నృత్యగాండ్రు
ధ్వను లీనగను తాళనినదంబుఁ గొంపోవ
బసు వెనుపోతు శుభంబుఁ గూర్చి
గీ. తనకు గళ్యాణ మనుచు సందడి వహించు
నంతియె గాని తన మృత్యు వని యెఱుంగ
దట్లు కానఁడు వచ్చు నిక్కట్లు నరుఁడు
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 94

సీ. అగ్నిచే నుపదగ్ధ మగుబీజసముదాయ
మంకురంబున కెట్టు లనువుపడును
భువి దధిజనితమౌ నవనీత మిసుమంత
దవులదు తక్రమధ్యమున గలుప
ఇక్షుఖండమున సమృద్ధియై వెలివడు
రస మిక్షువున గూర్ప లఘువు కాదు
పాత్రితోఁబిండిన పాలు గ్రమ్మర పొదు
గున నింపివైవ శక్యంబుగాఁదు.
గీ. దుర్భరంబగు సంసార దుఃఖజలధి
నుండి యుత్తీర్ణుఁ డసమాన పండితుండు
మరల సంసారపంకనిమగ్నుఁ డగునె
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర! 95.

సీ. అంత్యమునను బహుళాయాసమున జీవి
విత్తంబు రోగమం దత్తియుండు
తెల్వి కల్గిన వేళ దేరి చూచుచుఁ గండ్ల
నీరంబు లొల్కఁగాఁ నేడ్చుచుండు
నార్జించినట్టి పదార్థమ్ముల న్వీడ
మన సొప్పక విచారమగ్నుఁ డగును
తన లోకమే గాని మనలోక మిక లేదు
స్మృతి దప్పె నని బంధుతతులు గుందు
గీ. ఆలి యొకవంక వాపోవు లగ్నివంక
ఒక్కవంకను గింకరుల్ మ్రొక్కుటముగ
అన్నివంకల కీడ్తు రీయుపని జనులు
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 96.

సీ. నీనామరుచి పార్వతీనాథుఁ డెఱుఁగును
మేటియౌ తపసి వాల్మీకి కెరుక
పతితపావ నీపాదపద్మమహాత్మ్యంబు
బలియెఱుంగును పావని భార్య కెరుక
దోర్బలమహిమంబు దుర్భరం బగు నీదు
ధను వెరుంగును దైత్య ఘనున కెరుక
నీబాణశక్తి మున్నిటికి విదితంబు
వాలి మారీచ రావణుల కెరుక
గీ. ధ్యాత యెరుఁగును త్వన్మూర్తి ధ్యానమహిమ
జ్ఞాని యెరుగుదు రనిశమానందమహిమ
గాని నీమాయ నొకరైన గానరైరి
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 97.

సీ. మేఘమధ్యస్థయై మెరయు విద్యుల్లత
స్త్రీసౌఖ్య మగు స్వప్న రీతిఁ దనరు
చంచల మగు లక్ష్మి ఛాయాప్రతీతమై
మోహరించుచు ధైర్యమును హరించు
ఆయువులో హస్త మగ్నియందలి నీటి
బిందువు క్షణికత్వ మందుచుండు
ఊర్మిసదృశమున నొప్పెడు యౌవనం
బధ్రువంబది నిశ్చయంబు గాదు
గీ. ఐన నెరిఁగియు వీడ రత్యంధులగుచు
కాలసర్పాస్య పతిత భేకంబు దివురు
భంగి నీమాయఁ గనుప నెవ్వారితరము
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 84.

సీ. శ్రద్ధాకళత్రంబు సద్బుద్ధి జనయిత్రి
జ్ఞానసందనుఁడు సన్మార్గవ ర్తి
ముక్తిప్రదర్శి సద్భక్తి తోఁబుట్టువు
సంశయచ్ఛేదక జనకగురుఁడు
సంతోషకుఁడు తత్త్వచింత ధనాగార
మగు శాంతి సహచారి మానధనుఁడు
అంతరంగిక యోధు లగు శ్రవణాదులు
వైరాగ్యత్రయము సద్భటచయంబు
గీ. ద్వారపాలురు నిర్మల వాసనాళి
వృత్తిరహితమ్ము శుభదని కేతనమ్ము
శిష్టు సంసార మాత్మవశికరంబు
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 99.

సీ. భూరిసంపదగోరి పూజించెదరు గాని
ముక్తిఁగోర రిదెంత మూర్ఖమతులొ
ఇహలోకసౌఖ్యంబు నిచ్ఛగింతురు గాని
కైవల్య మన రెంత కఠినమతులొ
ఉముక దంచిన బియ్య ముంకునే యని బుద్ధి
దలపఁ జాల రదెంత కలుషమతులొ
బండి దెమ్మని యెల్లి బండి పీడని భంగి
ఫలము పీడ రదెంత తులువమతులొ
గీ. కపట ధర్మంబు పూజలు కపట భక్తి
కపటయుక్తులుఁ గ్రియలును గపటబుద్ధి
జగతి వర్తించి కుడుతురు తగినఫలము
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 100.

సీ. ఒకరి కున్నదటంచు నోర్వలేని గుణంబు
చిత్తంబు దరికొను చిచ్చు కాదె
తనకు లేదని యేడ్వ తన దేహవనమును
గాల్చు ప్రజ్వలితాగ్నికణము కాదె
క్రోధగుణంబుచేఁ గోతిమోము విధాన
కండ్లెర్రజేయుచుఁ బండ్లిగిల్చు
కామాదిదుర్గుణ కలితుఁడై స్మృతిదప్పి
త్రాగుబోతు విధాన ధరణి కొరగు
గీ. తొట్టిలో నుంచు వహ్నిచే నుగ్రమము మాడ్కి
కుచ్ఛితాదులు తనువును గ్రుంగఁజేయు
కరుణజలసేచనముఁ జేసి కావుమయ్య
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 101.

సీ. ధర్మశాస్త్రపయోధి ద్రచ్చియుంటిని గాని
యవలంబనము వీసమైన లేదు
ధర్మవిరుద్ధశాస్త్రము లెన్నియో వింటి
గాని వీడ్కొన లేదు కాంక్షతోడ
నీతు లెన్నియొ కడునేర్పుతో బోధించి
చెప్పుచుండుదు కాని సేత లేదు
ప్రారబ్ధదైవ మెప్పట్టునను ద్రిప్ప
నట్టులే పోదు మోహాంధమునను
గీ. ఇట్టి క్రియలకు జిత్త మెట్లిష్టపడును
అయిన బ్రారబ్ధమునఁ బ్రతిక్రియయు లేదు
వాసనారబ్ధువుల ద్రెంప వశముగాదు
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 102.

సీ. అతఁడు సదాశివుం డితఁడు సదానందుఁ
డను సంజ్ఞచే భేద మైతివయ్య
హరి యాతఁ డాతఁడు హరుఁ డంచు వేశ్వర
నామధేయంబుల నలరి తయ్య
గిరిధారి యాతఁడు గిరిశుం డతం డంచు
బలురూపముల వ్యాప్తి నైతివయ్య
శేషశాయివి నీవు శేషభూషణుఁ డాత
డని రూపవిశ్లేషి నైతివయ్య
గీ. వేరుగా నున్న ధేనువుల్ క్షీర మొకటె
యైన విధమున చేతన మరఁగ నొకటె
నీవె శివుఁడవు విష్ణువు నీవె కాద
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర! . 103.

సీ. భ్రూమధ్యమున ధ్వనుల్ మ్రోయంగ నాదస్వ
రూపబ్రహ్మంబవై రూపుఁ జూపి
అజ్ఞ కర్ణికమైన యవ్యక్తమున నుండి
యాంతరప్రేరకుం డనఁగఁ బరగి
నాసికామూలమం వాసియై జీవాఖ్య
నొప్పి యవిద్యచేఁ గప్పియుండి
నాభికంఠములలో శోభితంబై విశ్వ
తైజసత్వమునఁ దేజరిల్లి
గీ. ఒక్కఁ డయ్యును మాయచేఁ బెక్కులుగను
నామరూపంబులను గల్పనల నొనర్చి
తోఁచుచుంటివి యాట దోఁబూచు లట్లు
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 104.

సీ. ఉడ్డీయమానమై యుత్కంధరంబున
శవమాంసమున కఱ్ఱుచాచుచుండి
వాహకు లదలింప వడివడిగనుఁ బారి
కుర్కురమ్ములఁ దోలి గ్రుడ్లు ద్రిప్పి
పినభూతరూపంబు ననువుగా ధరియించి
మొగ మమంగళమునై రగులుకొనుచు
ప్రేతభూమిని నక్క గోతుల దుమికెడు
గృధ్రము వలె చిత్త గృధ్రి మొప్పు.
గీ. హృదయకుహరంబునం జీవు నెదురుకొనుచు
కండ లూడంగ బొడుచు నీమొండిగ్రద్ద
చిత్త మిది బోధ గల్గిన శిథిల మగును.
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 105

సీ. ఒకదుఃఖమున కంటె నొకదుఃఖ మధికంబు
గల్గు చుండెను గాలకర్మవశత
స్వాతివర్షము చిత్తజల్లులన్న విధాన
పొరిఁబొరిదుఃఖము ల్పొరలుచుండు
చితియందు నగ్ని యుద్ధతదహించినరీతి
నాధులు దహియించు నాంతరమున
చింతల కెడమీక స్వాంతంబు నరికట్టు
గంగ వడువున నుప్పొంగుచుండె
గీ. కన్నులను దుఃఖజలములు గ్రమ్మునట్లు
భక్తులను మేటి కష్టము ల్పాలుసేసి
ముక్తిసంధాతవగుట నీమోటుగుణము
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 106.

సీ. శమదమకుసుమగుచ్ఛముల కాధారంబు
భవ్యతరం బైన దివ్యతరువు
కామసంతాపంబు గజిబిజి నడగించు
నానందసలిలపద్మాకరంబు
జ్ఞానవిజ్ఞానపరిజ్ఞానఘనం బైన
పుటపాకహాటకభూధరంబు
ధ్యానమకరందము ల్తనివితీరగ గ్రోలు
మునిజనషట్పదాంభోరుహంబు
గీ. భక్తజనముల పాలి కల్పద్రుమంబు
దురితహారిణంబు సద్వృత్తిదోహదంబు
సచ్చిదానందమే నీదు సహజగుణము.
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 107.

సీ. సరగున నీపాదసరసీరుహమునందు
చిత్తషట్పదము వసించుగాత
త్వత్పాదపంజరాంతమున మానస
రాజహంస సుఖించి క్రాలుఁగాత
చరణయుగ్మరసాలసాలపల్లవముల
చిత్తకోకిలము భక్షించుగాత
పరివిమలభవదంఘ్రివారివాహజధార
ధీచాతకం బాస్వదించుగాత
గీ. మరణవేళను నాకెట్లు స్మరణకల్గు
పిలిచెదను నీక్షణంబున బలుకవయ్య
రామ! రాఘవ! శ్రీరామ! రవికులేంద్ర!
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 108.

సీ. ఈముద్దతోపులు నింతటికిఁకో చాలు
సంసారసౌఖ్యమ్ము చాలు చాలు
పడిన కష్టచయంబు నడినెత్తి కెక్కెను
జన్మమృత్యుసుఖంబు చాలు చాలు
మోహాటవి సుఖంబు మొదటికిఁ బోధించె
మోలఁ జేర్పుము సిగ్గు చాలు చాలు
సంసారదావాగ్ని జ్వలియించె నూపిరి
చలియించకున్నది చాలు చాలు
గీ. మరల గోరిన బెట్టుము మాఱువాట్టు
చాలు తెలిసెను నీమోహజాలమహిమ
నాసికాకర్ణఖండనన్యాయ మయ్యె
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర! 109.

సీ. కనకాదులం గాగు ననకాపలిపురంబు
కాపురిస్థలము సౌఖ్యాకరంబు
జనకుని సభలోన జయపుత్రిక గ్రహించి
అలమందను గోను యాజ్ఞవల్క్య
శాఖలోఁ బ్రధితమా చదువుల వంశజుం
డగు మల్లనామాత్యుఁ డతని యాత్మ
జుఁడు రామమూర్తి సౌమ్యుండు వానికిన్ సూను
డై యొప్పు వీశరాజాహ్వయుండ
గీ. సరవి వైరాగ్యపుష్పగుచ్ఛముఁ గూర్చి
కరయుగము మోడ్చి యర్పింతుఁ బురుషసింహ
తడయ కిదె గొను తప్పులతడక యనక
రమణగుణసాంద్ర! రఘుకులరామచంద్ర!. 110.